## శ్రీఅనంతపద్మనాభ క్షేత్రమహిమ

సమర్పణము – తిరుమల పెద్దింటి వేంకటరమణ (బుచ్చిబాబు)

ప్రథమ ముద్రణ : 2017

ప్రతులు : 500

సందర్భము : అనంతపద్మనాభ చతుర్దశి

ముఖచిత్రం : శ్రీఅనంతపద్మనాభస్వామి, పద్మనాభం విశాఖపట్నం జిల్లా

ఈ గ్రంథం, అనంతపద్మనాభ చతుర్దశి నాడు
పద్మనాభ క్షేత్రంలోని శ్రీఅనంతపద్మనాభస్వామివారి
కైంకర్య రూపంగా భాగవతాచార్య ప్రీత్యర్థం
సమర్పింపబడుతున్నది.

క్షేత్రస్య పద్మనాభస్య మహిమా సోయ మర్ప్యతే ।
భగవద్భాగవతాచార్యసేవారూపేణ భక్తితః ॥

ప్రతులకు : శ్రీమాన్ టి.పి.వి. రమణగారు
94, పి.యస్.ఆర్. కాలని
విజయనగరం–535 002
ఫోన్ : (08922) 223179

డి.టి.పి. : శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి, భవానినగర్, తిరుపతి.
యస్.చంద్రశేఖర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.



# పద్మనాభనామ వైభవం

హృత్పద్మే పద్మనాభో మే సహస్రార్క సమప్రభః ।
సర్వాయుధః సర్వశక్తిః సర్వజ్ఞః సర్వతోముఖః ॥

పద్మనాభుడను తిరునామము భగవానుని ద్వాదశ నామములలో 11వ నామము. ఇది మూర్తులకన్నిటికిని మూలావ తారమై వెల్గువాడును, పద్మనాభుడను ఈ తిరునామమును కలవాడగు క్షీరాబ్ధినాథుని వర్ణించుచున్నది. ఇచట కొన్ని అంశములు తెలియదగినవి కలవు. అనిరుద్ధ నారాయణుడే బ్రహ్మను సృష్టించెనని, అన్ని అవతారములకు అతడే మూలమూర్తి అని తెలుపు ప్రమాణములున్నవి. పద్మనాభుడను పేరువలన బ్రహ్మ రుద్రులకు నడుమ చెప్పబడు శ్రీవిష్ణుమూర్తియే బ్రహ్మను సృష్టించెనని తోచుచున్నది. **"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః , నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"** (పాలకడలిని నివాసంగా కలవాడు, లక్ష్మిని కలవాడు అయినా ఈ నారాయణుడు శేషశయనాన్ని విడిచి మధురాపురికి వచ్చాడు కదా!) అని పాలకడలిలో నిద్రించు భగవానుడే కృష్ణుడు మొదలగు అవతార మూర్తులకు మూల భూతుడని చెప్పబడుచున్నది. ఇవి ఎట్లు పొసగును? అనినచో, అనిరుద్ధునివలన క్షీరాబ్ధినికేతనుడు అవతరించుచున్నాడని, అతనివలన మిగిలిన అవతారములు ఏర్పడుచున్నవని తలచినచో అవతార మూర్తులకు అనిరుద్ధుని, క్షీరాబ్ధినాథుని మూలమూర్తిగను గ్రహింపవచ్చును. **"పద్మనాభాదికాః సర్వే...... అనిరుద్ధా త్సముత్పన్నాః దీపాద్దీపా ఇవేశ్వరాః"** అను ప్రమాణముతోను ఇది పొసగును. మహాప్రళయములో అనిరుద్ధుడు, నైమిత్తికప్రళయములో క్షీరాబ్ధినాథుడును బ్రహ్మను సృష్టింతురనియు చెప్పవచ్చును. లేక, ధర్మైక్యమువలన ఇద్దఱును బ్రహ్మోత్పాదకులుగా చెప్పబడుచున్నారనియు భావింపవచ్చును. పురుషసూక్తమునందుకూడ **"పాదోఽస్య"** అని అనిరుద్ధుని ప్రస్తావించి, **"ఇహాభవాత్పునః"** (ఇచట మఱల అవతరించిరి) అని అతని అవతారభూతుడగు క్షీరాబ్ధినాథుడు చెప్పబడినట్లు గను, **"తతో విష్వఙ్ వ్యక్రామత్"** అని వారి అవతారవ్యాప్తిని చెప్పినట్లుగను, **"తస్మా ద్విరాడజాయత"** అని ఆ

క్షీరాబ్ధినాథుని వలన బ్రహ్మ ఉత్పన్నుడైనట్లు చెప్పబడినట్లుగను అర్థము K„³ æKÇ# °. N q+pâ,¬ìã ◂Œ°ª ê €ò ..Ã€_Ë**“పద్మనాభోఽమరప్రభుః”** అని వ్యూహములో నాల్గవది అగు అనిరుద్ధునిగూర్చి, **‘పద్మనాభః ప్రజాపతిః’** అని మొదటి అవతారమైన విష్ణువునుగూర్చియు పద్మనాభశబ్దము ప్రయోగింపబడుట యును, **“పద్మనాభః ప్రజాపతిః”** అను సందర్భమున భాష్యములో **“నైమిత్తికసృష్టిప్రళయ విషయం చైతత్ దృష్టాంతమ్”** (ఈ బ్రహ్మసృష్టి నైమిత్తిక సృష్టి ప్రళయ విషయమునకు సంబంధించినదని చెప్పనగును) అని భట్టర్ అనుగ్రహించుటయును ఇచట స్మరింపనగును. ఇక, పద్మనాభనామముయొక్క విశేషార్థమును కొంత అనుసంధించెదము.

**(పద్మనాభః) - “సర్వజగత్కారణం పద్మం నాభౌ యస్య సః”** (జగత్తుల కన్నిటికిని కారణమైన పద్మమును నాభిలో కలవాడు ఎవడో అతడు) అని శంకరభాష్యములో ఈ నామము వివరింపబడినది. **“పామరు మూవులకుమ్ పడైత్త పఱ్పనాబా! వో”** (స్థావర జంగమాత్మకమై నిండి ఉండు ముల్లోకములను సృష్టించిన పద్మనాభా!) అని ఆళ్వార్లు, **“ఊழி ముదల్వన్ పాழியమ్ తోళుడై ప్పఱ్పనాబన్”** (చేతనాచేతనములకు కారణభూతుడైన, విశాలమైన, సుందరమైన భుజములను కల పద్మనాభుని తిరుమేనివలె దేహము నల్లనిదై) అని గోదాదేవియు పద్మనాభశబ్దార్థమును వివరించిరి. **“ధాతోత్థానః సంవిశతి పంచవర్షశతాని తు”** (పద్మసంభవుడగు బ్రహ్మ తామరపూవులో జన్మించినవాడై అయిదువందల ఏండ్లు ప్రవేశించెను) అని, **“తత్తు నాభ్యాం పుష్కరం ప్రాదుర్భవతి”** (సర్వలోకమును ధరించు నారాయణుని నాభిలో తామర పుట్టినది) అని, **“అజస్య నాభా వధ్యేకమర్పితమ్”** (జన్మ లేని స్వామినాభిలో ఒక తామరపూవు ఆవిర్భవింప జేయబడినది) అనియు **“యన్నాభిపద్మాదభవన్మహాత్మా ప్రజాపతి విశ్వసృట్ విశ్వరూపః”** (లోకమును రూపముగా కలవాడు, లోకమును సృష్టించువాడును అగు బ్రహ్మ ఎవరి కమలమునుండి ఆవిర్భవించెనో) అని మహోపనిషత్తులో, **“బ్రహ్మ వై బ్రహ్మాణమ్ పుష్కరేఽసృజత్”** (బ్రహ్మము చతుర్ముఖుని తామరపూవులో ఆవిర్భవింపజేసినది) అని అధర్వణవేదమునందును, **“స ప్రజాపతి రేవ పుష్కరపర్ణే సమభవత్”** (ఆ బ్రహ్మ



ఒక్కడే భగవానుని నాభికమలములో ఆవిర్భవించెను) అనియు - ఇట్లు పలు పలు వాక్యములతో వేదమునందును, **“యత్తత్ పద్మ మభూ త్పూర్వం తత్ర బ్రహ్మా వ్యజాయత, బ్రహ్మణ శ్చాపి సంభూతః శివ ఇత్యవధార్యతామ్, శివాత్ స్కంధ స్సంబభూవ ఏతత్ సృష్టిచతుష్టయమ్”** (భగవానుని నాభినుండి ఏ తామరపూవు పూర్వము పుట్టినదో, అందు బ్రహ్మ పుట్టెను. ఆ బ్రహ్మవలన శివుడు జన్మించెనని తెలియనగును. శివునివలన స్కంధుడు పుట్టెను. ఇది మొదట ఏర్పడిన నాల్గు విధములైన సృష్టి) అని మహాభారతమునందు, **“కదాచిత్తస్య సుప్తస్య నాభ్యాం కామా దజాయత, దివ్య మష్టదళం భూరి పంకజం పార్థివం మహత్, యస్య హేమమయీ దివ్యా కర్ణికా మేరు రుచ్యతే”** (ఆ భగవానుడు ఒకానొక సమయమున యోగనిద్రలో నున్నపుడు అతని సంకల్పమువలన అతని నాభినుండి ఎనిమిది దళములను కల్గినది, పృథివీ సంబంధమును కల్గినది, మిక్కిలి పెద్దది, అందమైనది అగు తామరపూవు ఆవిర్భవించినది. దానియొక్క బంగారుమయమైన, అందమైన కర్ణిక మేరుపర్వతమైనదని చెప్పబడుచున్నది) అని పాద్మపురాణములో తెలుపబడినది. **“నావియుళ్ నఱ్కమల నాన్ముకనుక్కొరుకాల్ తమ్మనై యానవనే!”** (నాభిలో మొలచిన గొప్ప పద్మమునుండి పుట్టిన బ్రహ్మకు అతడు వేదాలను కోల్పోయి చింతించు కాలమున తల్లివలె వానిని అనుగ్రహించిన వాడా!) అని పెరియాళ్వార్లు, **“నాట్టై ప్పడై యెన్ఱయన్ ముదలా త్తన్ద నళిర్మామలరున్ది వీట్టై ప్పణ్ణి విళైయాడుమ్ విమలన్తన్నై క్కణ్డీరే!”** (లోకాలను సృష్టించు - అని బ్రహ్మమొదలగు ప్రజాపతులను సృష్టించిన చల్లని, పెద్ద తామరపూవును కల నాభి అను ఇంటిని సృజించి క్రీడించు పరమపావనుడైన వానిని చూచితిరా!) అని గోదాదేవి, **“తామరైమేల్ అయనవనై ప్పడైత్తవనే!”** (తిరునాభికమలములో బ్రహ్మను సృష్టించినవాడా !) అని కులశేఖరాళ్వార్లు, **“పోదు తఙ్గు నాన్ముకన్ మకన్ అవన్ మకన్ శొలిల్ మాదు తఙ్గు కూఱన్ ఏఱ తూర్తి ఎన్ఱు వేదనూల్ ఓదుకిన్ఱ తన్మై అల్లదిల్లై మఱ్ఱురైక్కిల్”** (నాభికమలంలో పొందికగా ఉండు బ్రహ్మ పుత్రుడు. ఇంకను చెప్పినచో, పార్వతి నివసించు సగభాగమును కలవాడు, వృషభమును వాహనముగా కలవాడగు

రుద్రుడు అతనికి మనుమడు- అని ఈ రీతిలో వేదమనెడి శాస్త్రము పల్కునది సత్యము. ఈ విధముగా కాకుండ వేఱొక విధమున చెప్పినచో అది అసత్యము) అని తిరుమఴిశైయాఴ్వార్లు, **"అయనై పడైత్త దోరెఴిల్ ఉన్ది"** (బ్రహ్మను సృష్టించిన, అద్వితీయమైన, ప్రకాశించు నాభి) అని తిరుప్పాణాఴ్వార్లు, **"అజ్గమలత్తయన్"** (అందమైన నాభీకమలములోని బ్రహ్మ) అని, **"ఒరువనై ఉన్దిపూమేల్ ఓజ్గ విత్తు"** (ఒకనిని - బ్రహ్మను నాభీకమలములో సృష్టించి) అనియు తిరుమజ్గైయాఴ్వార్లు, **"శెయ్య మఱైయాన్ నిన్ ఉన్దియాన్"** (ఋజువైన వేదమును అభ్యసించు బ్రహ్మ నీ నాభీకమలములో ఉన్నాడు) అని, **"నాన్ముకఱ్కు ప్పూమేల్ పకరమఱై ప్పయన్ద పణ్బన్"** (నాభీకమలంలోని చతుర్ముఖునకు వాసస్థానమును అనుగ్రహించి, ఇతరులకు ఉపదేశించు రీతిలో వేదమును అనుగ్రహించిన సద్గుణశీలి) అని పొయ్కైయాఴ్వార్లు, **"ఇరున్దణ్ కమలత్తిరుమలరినుళ్ళే తిరున్దు తిశైముకనై త్తన్దాయ్"** (విశాలమైన, చల్లని నాభీకమలము లోపల సమర్థుడైన చతుర్ముఖుని సృష్టించితివి) అని పూదత్తాఴ్వార్లు, **"అలరెడుత్త ఉన్దియాన్"** (వికసించిన తామరపూవును కల నాభిని కల్గినవాడు) అని పేయాఴ్వార్లు, **"ఒరు తానాకి త్తెయ్వ నాన్ముక క్కొఴుముళై ఈన్టు ముక్కణీశనొడు తేవు పల నుదలి మూవులకుమ్ విళైత్త ఉన్ది మాయక్కడవుళ్ మాముదలడియే"** (ఉపాదానకారణముగా తానే అయినవాడై, చతుర్ముఖదేవుడను పూర్ణమైన అంకురమును, త్రినేత్రుడైన రుద్రునితోపాటు పలువురు దేవతలను సృష్టించి, వీరిని సృష్టి - సంహారములకు యోగ్యులుగా సంకల్పించి, ముల్లోకములను సృష్టించిన నాభిని కలవాడై, ఆశ్చర్యభూతుడైన పరదేవతయై, పరమకారణభూతుడైన పురుషోత్తముని శ్రీపాదములను) **"పాముఱు మూవులకుమ్ పడైత్త పఱ్పనాబా!"** అని అని నమ్మాఴ్వార్లును భగవానుడు సర్వజగత్కారణమైన పద్మమును నాభిలో కల్గి వెల్గుచుండుటను దర్శించి, అనుభవించిరి. "అజనిష్ట చ కస్య నాభేః" (ఎవని నాభినుండి ఈ లోకము ఆవిర్భవించినదో) అని ఆళవన్దార్ కూడా పల్కిరి. **"త్రయో దేవా స్తుల్యా స్త్రితయ మిద మద్వైత మధికం త్రికా దస్మా త్తత్త్వమ్ పర మితి వితర్కాన్ విఘటయన్, విభో ర్నాభీపద్మో విధిశివనిదానం భగవతః**



**తదన్యద్భ్రూభంగీపరవ దితి సిద్ధాంతయతి నః"** (త్రిమూర్తులును సమానులు, ముగ్గురును ఒక్కరే, ముగ్గురికంటె విలక్షణమైన వేఱొక పరత్త్వము కలదు- అను వితండవాదములను భగ్నము చేయుచు, బ్రహ్మరుద్రులకును మూలకందమైయున్న శ్రీరంగనాథుని నాభీకమలము ఆ స్వామి తప్ప మిగిలిన అన్నియు అతని కనుబొమల కదలికలను అనుసరించి వర్తించునవి - అను సిద్ధాంతమును మనకు తెలియజేయుచున్నది) అని పరాశరభట్టరును తెలియజేసినట్లు పరతత్త్వనిరూపణమును ఈ నామము చేయుచున్నది. ఈ అర్థమే **"కొణ్డమూర్త్తియోర్ మూవరాయ్ క్కుణజ్గళ్ పడైత్తళిత్తు క్కెడుమ్ అప్పుణ్డరీక కొప్పూఴ్ పునల్ పళ్ళియప్పన్"** (త్రిగుణాలను కల్గిన మూడు రూపాలను కలవాడై, జగత్తును సృష్టించి, రక్షించి లయంచేసేవాడైన, సముద్రంలో పయనించే పద్మనాభుడు) అను శఠకోపుల సూక్తి తెలుపుచున్నది.

**(పద్మనాభః)**- "పద్మ మివ నాభిః యస్య సః" (తామరపూవువంటి నాభి ఎవనికి కలదో అతడు) అను అర్థమునుకూడ గ్రహింపవచ్చును. **"హృత్పద్మస్య నాభౌ మధ్యే ప్రకాశమానత్వాత్ వా పద్మనాభః"** (హృదయకమలములో నడుమ ప్రకాశించుటచే పద్మనాభుడనబడుచున్నాడు) అని శంకరులు భట్టర్‌ను వివరించిరి. **"కొప్పూఴిల్ ఎఴు కమల పూ్ప అఴకన్"** అని గోదాదేవి ఈ అందమును వర్ణించినది. విష్ణుసహస్రనామములో కూడ **"హృషీకేశ"** నామమునకు పిమ్మట ఈ పద్మనాభనామము పఠింపబడినది.

ఇపుడు పెరియాఴ్వార్ తిరుమొఴిలో ఈ నామ పాశురము, దాని భావము -

**కణ్ణై క్కుళిర క్కలన్దెజ్గుమ్ నోక్కి క్కడికమఴ్ పూజ్గుఴలార్‌గళ్**
**ఎణ్ణత్తుళెన్టు మిరున్దు తిత్తిక్కుమ్ పెరుమానే ! ఎజ్గళముదే !**
**ఉణ్ణ క్కనిగళ్ తరువన్ కడిప్పొన్టుమ్ నోవామే కాదు క్కిడువన్**
**పణ్ణైక్కిఴియ చ్చగడ ముదైత్తిట్ట పఱ్పనాపా ! ఇజ్గే వారాయ్**

మనస్సు చల్లబడేటట్లు నీవు నీ కళ్ళను గోపికల నేత్రాలలో కలిపి వారి రూపాన్ని పూర్ణంగా చూచి, పరిమళించే పుష్పాలను అలంకరించుకొన్న కేశాలను

కల ఆ స్త్రీల మనస్సులలో ఎల్లప్పుడూ నిలచి ఉండి ఆనందించే గొప్పతనాన్ని కల మా అమృతస్వరూపా! నీవు తినడంకోసం నేరేడు పండ్లను ఇస్తాను. కర్ణాభరణాన్ని ఏమీ నొప్పి లేకుండేటట్లు నీ చెవిలో అలంకరిస్తాను. అసురావిష్టం అయిన శకటాన్ని కూలగొట్టిన పద్మనాభా! ఇక్కడకు రా !

ఇపుడు తిరువాయ్‌మొழிలోని ఈనామపాశురము, దాని భావము.

పఱ్బనాబ నుయర్వఱవుయరుమ్ పెరున్దిలోన్
ఎఱ్బర నెన్నై యాక్కిక్కొణ్డు ఎనక్కే తన్నై త్తన్ద
కఱ్బగమ్ ఎన్నముదమ్ కార్‌ముగిల్ పోలుమ్ వేఙ్గడనల్
వెఱ్బన్ విశుమ్బోర్ పిరాన్ ఎన్దై తామోదరనే

లోకం అంతా వ్యక్తం కావడానికి (సృష్టింపబడడానికి) కారణం అయిన (నాభీ) కమలాన్ని నాభిలో కలవాడు, ఇంతకంటే వేఱయిన గొప్పది ఎక్కడ లేదు అనేటట్లు గొప్ప, అపారమైన శక్తిని కలవాడు, నాపట్ల ఆదరాన్ని కలవాడు, నన్ను సృష్టించి, అంగీకరించి, నాకే అసాధారణం అయేటట్లు తనను తాను అనుగ్రహించిన కల్పవృక్షంవంటివాడు, నాకు పరమభోగ్యుడు, కాలమేఘం వంటివాడు, శ్రీవేంకటాచలం అనే గొప్ప పర్వతాన్ని నివాసంగా కలవాడు, నిత్యసూరులకు నాథుడు, ఆశ్రితవిధేయుడు అయిన భగవానుడు నాకు స్వామి.

శ్రీ దేశికుల పన్నిరునామంలోని ఈనామపాశురము, దాని అర్థము -

ఎమ్ పఱ్బనాబను మెన్ పిన్ మనమ్ పఱ్ఱి మన్ని నిన్రు
వెమ్ పొఱ్కదిరవ నాయిర మేనియ మెయ్యురువాయ్
అమ్ పొఱ్కరఙ్గళిల్ ఐమ్‌పడై కొణ్డు అఞ్జలెన్ఱళిక్కు
శెమ్‌పొఱ్ఱిరుమదిళ్ శూழ் శిన్దురాశల చ్చేవకనే

శెమ్ పొన్ తిరు మదిళ్ శూழ் = ఎఱ్ఱని బంగారముతో నిర్మించిన, అందమైన ప్రాకారములు చుట్టియున్న, శిన్దురాశల చ్చేవకన్ = హస్తిగిరిలోనున్న మహావీరుడగు వరదరాజస్వామి, ఎమ్ పఱ్బనాబనుమ్ = మన పద్మనాభుడై, ఎన్ పిన్ = నా వెనుక భాగమును,మనమ్ = మనస్సును, పఱ్ఱి మన్ని నిన్రు =



ఆశ్రయించి, స్థిరముగా నుండి, వెమ్ పొన్ = వేడిగానున్న ఎఱ్ఱని,ఆయిరమ్ కదిరవన్ = వేయిమంది సూర్యులతో, మేనియ మెయ్ ఉరువాయ్ = సమమైన తిరుమేని వర్ణమును కలవాడై, అమ్ పొన్ కరఙ్గళిల్ = అందమైన, ఎఱ్ఱని శ్రీహస్తములలో, ఐమ్బడై కొణ్డు = పంచాయుధములను దాల్చి, అఞ్జల్ ఎన్రు = భయపడకుము అనుచు (పల్కి), అళిక్కుమ్ = కాపాడును.

ఇచటి మూర్తి పద్మనాభుడు. వర్ణము - సూర్యవర్ణము. ఆయుధములు- శంఖ, చక్ర, ఖడ్గ, గదా, ధనుస్సులు అను పంచాయుధములు. స్థానము - మనస్సు. పుండ్రస్థానము - (నడుము) వెనుకభాగము.

పృష్ఠే సుహృదయా దేవ్యా మహాలక్ష్మ్యా విరాజితమ్ ।
పంచాయుధమ్ పద్మనాభం ప్రణమామ్యర్కరోచిషమ్ ॥

పద్మనాభుని నాభీకమల వైలక్షణ్యాన్ని గూర్చి ఆళ్వార్ల అనుభవాలు పరమ భోగ్యాలు. పెరియాళ్వార్లు "పుదునాణ్ మలర్ కమలమ్ ఎమ్బెరుమాన్ పొన్ వయిఱ్ఱిల్ పూవే పోల్వాన్ పొదునాయకమ్ పావిత్తిఱుమాన్దు పొన్‌శాయ్‌క్కుమ్" పునల్ అరఙ్గమ్" (అపుడే వికసించిన, శోభను కోల్పోని తామరపూవు, పద్మ నాభుని అందమైన తిరునాభిలో ఉండే కమలంతో తాను పోలి ఉండడం కోసం దానితో తాదాత్మ్యాన్ని భావించి, సర్వనిర్వాహకత్వాన్ని తానుకూడా కల్గి ఉన్నానని ఉద్భావించి, గర్వంతో మిగిలిన తామరపూవుల అందాన్ని తిరస్కరించేటట్లుగా భాసించే నీటి సమృద్ధినికల శ్రీరంగం) అనే సూక్తి ద్వారా భగవానుని నాభీ కమలంతో సామ్యాన్ని భావించినందువల్ల శ్రీరంగంలో పూచిన కమలానికి కల్గిన ఉత్కర్షను తెలిపారు.

పేయాళ్వార్ల తిరువన్దాదిలో కన్పించే ఇంకొక సూక్తివైభవం మరింత భోగ్యం."అఙ్గు మలరుమ్ కువియుమ్ మాల్ ఉన్దివాయ్, ఓఙ్గు కమలత్తినొణ్ పోదు, ఆమ్‌కైత్తికిరి శుడరెన్ఱుమ్ వెణ్‌శఙ్గమ్ వానిల్ పకరు మతిఎన్ఱుమ్ పార్‌త్తు" అనే పాశురంలో - పద్మనాభుడు తన బాహువులలో ధరించిన చక్రం సూర్యుని వలె, శంఖం ఆకాశంలోని చంద్రునివలె భాసించినందున, ఆస్వామి నాభీకమలం ఒకే సమయంలో వికసిస్తూ, ముడుచుకుంటూ ఉన్నది - అని పల్కిన సూక్తిలోని

భావనాసౌందర్యం అపూర్వం. తామరపూవు సూర్యుని చూస్తే వికసించి, చంద్రుని చూస్తే ముడుచుకుంటుంది గదా! ఒకే కాలంలో రెండు పరస్పరవిరుద్ధ ధర్మాలను కల్గినదై నాభీకమలం దర్శనమివ్వడం అపూర్వం.

ఆళ్వార్లు భగవానుని దివ్యసౌందర్యం పట్ల గల మిక్కిలి అభినివేశం కారణంగా నాయికాభావాన్ని పొంది, విరహావస్థను వ్యక్తం చేసిన పాశురాలు అనేకం ఉన్నాయి. తిరుమంగై ఆళ్వార్లు నాయకీభావంతో పెరియతిరుమొழி ప్రబంధంలో ఒకచోట పద్మనాభుని విషయంలో వ్యక్తం చేసిన విరహావస్థ గమనించదగినది. **"కణ్ణపురత్తుఱైయుమ్ వజ్గమలి తడమ్ కడలుళ్ వరియరవిననైౖ త్తుయిన్ఱ శెజ్గమలనాబనుక్కు యిழన్దేన్ ఎన్ శెఱివళైయే"** **(8-3-8)** అనే పెరియ తిరుమొழி ప్రబంధ సూక్తిలో ఆళ్వార్‌నాయకి తిరుక్కణ్ణపురం అనే క్షేత్రంలో ఆదిశేషునిపై శయనించిన పద్మనాభునకు తమ స్త్రీత్వ సూచకాలైన వలయాలను (గాజులను) కోల్పోయినట్లు, అంటే - ఆ స్వామికి తాను వశమైనట్లు పల్కడం ఒక చక్కని ఉదాహరణ.

సుదర్శనధారియైన పద్మనాభుని సొబగును గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో **"పఱ్పనాబన్ కైయిల్ ఆழிపోల్ మిన్ని"** అనే **(4)** సూక్తిలో అభివర్ణించారు. పర్జన్యదేవుని వర్షంకోసం ఈ పాశురంలో ప్రార్థిస్తూ, అతడు పద్మనాభుని చేతిలోని చక్రంవలె అపూర్వంగా మెఱవాలని కోరారు. ఈ సూక్తిలోని ఆంతర్యాన్ని, అందాన్ని మన పూర్వాచార్యులు వ్యక్తం చేసిన తీరు ఆశ్చర్యకరం. పద్మనాభుని నాభీకమలంనుండే కదా చతుర్ముఖ బ్రహ్మ ఉద్భవించాడు. ఆవిధంగా, తనకు కుమారుడు కలిగినందున పద్మనాభునకు చాలా ఆనందం కలిగింది. లోకంలో **"పుత్రస్తే జాతః"** (నీకు కొడుకు పుట్టాడు) అంటే ఏ తండ్రికి సంతోషం కలుగదు! సర్వలోక చక్రవర్తి అయిన భగవానుడు తనకు కల్గిన ఆనందాన్ని విలక్షణంగా వ్యక్తం చేశాడు. లోకంలో చక్రవర్తులకు ఆనందం కలిగినప్పుడు వారు ఆ ఆనందాన్ని సాక్షాత్తు తాము వ్యక్తం చేయకుండా, తమ పరివారం నిర్వహించే ఆనందం కోలాహలం ద్వారా దానిని తెలియజేస్తారు. ఆవిధంగానే ఇక్కడ భగవానుడు తన ఆనందాన్ని తనకు నమ్మిన సేవకుడైన సుదర్శనుని ద్వారా వ్యక్తం చేశాడు. అంటే, సుదర్శనుడు



తన అపూర్వమైన మెఱపుల ద్వారా భగవానుని ఆనందాన్ని వెలువరించాడు - అని పెరియవాచ్చాన్‌పిళ్ళై, నాయనార్ వంటి అభిజ్ఞులైన ఆచార్యులు వివరించారు. ఈవిధంగా దివ్యప్రబంధాలలో, వాటిని వ్యాఖ్యానించిన పూర్వాచార్యుల సూక్తులలో ఎన్నో విశేషాలు పద్మనాభునికి సంబంధించినవి ఉన్నాయి.

పద్మనాభ సన్నివేశంతో భగవానుడు వెలసిన దివ్యక్షేత్రాలలో, కేరళలోని తిరువనంతపురం (త్రివేంద్రం) విలక్షణమైనది. **"వయలణి అనన్దపురమ్ పడముడై యరవిల్‌పళ్ళి పయిన్ఱవన్ పాదమ్ కాణ నడమినో"** అని అంటూ నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొழி ప్రబంధంలో **(10-2-8)** అనంతపురంలో ఆదిశేషునిపై శయనించి ఉండే స్వామిని తప్పక సేవించమని ఉపదేశించారు. యామునులు ఈ సూక్తిని విని, వెంటనే తమ శిష్యులతో కలసి తిరువనంత పురానికి వెళ్ళి, అక్కడ వేంచేసి యుండే స్వామిని సేవించినట్లు ఐతిహ్యం కూడా.

ఈవిధంగానే ఆంధ్రదేశంలో విశాఖజిల్లాలోని పద్మనాభక్షేత్రం మిక్కిలి ప్రసిద్ధికెక్కింది. ఇక్కడ మూలమూర్తి స్వయంవ్యక్తం. అర్చా మూర్తి కుంతీదేవిచే ప్రతిష్ఠింపబడ్డాడు. చిరకాలంగా ఇచటి పద్మనాభస్వామి భక్తుల కొంగు బంగారంగా, కల్పవృక్షంగా భాసిల్లుతున్నాడు. ఈ క్షేత్రం శ్రీవైష్ణవ సంప్రదాయానికి కేంద్రంగా అనాదిగా విరాజిల్లుతున్నది. ప్రసిద్ధ పండితులైన శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి, శ్రీమాన్ కందాళ వేంకటాచార్య స్వామి వంటి విద్వాంసులు పద్మనాభం క్షేత్రానికి చెందినవారే. ఈ క్షేత్రవైభవాన్ని ఆస్తికులందరికీ ఈ చిరుగ్రంథం ద్వారా అందించే ప్రయత్నాన్ని చేస్తున్న **సహృదయ శిరోమణి ఉ.వే. శ్రీమాన్ టి.పి.వి. రమణ స్వామివారికి** ఆస్తిక లోకం ఋణపడి ఉన్నది. యథాశక్తి పద్మనాభవిషయంలో వాచికకైంకర్యాన్ని చేసుకునే గొప్ప అవకాశాన్ని ఇచ్చిన శ్రీమాన్ రమణస్వామివారికి అనేక కృతజ్ఞతా పూర్వక నమస్సులు.

భాగవత విధేయుడు

**ఈ.ఏ. శింగరాచార్యులు**



**శ్రీమతే రామానుజాయ నమః**

## పద్మనాభం (విశాఖపట్టణం జిల్లా)

# శ్రీ అనంతపద్మనాభ క్షేత్రమహిమ

క్షేత్రస్య పద్మనాభస్య మహిమా సోయ మర్చ్యతే ।
భగవద్భాగవతాచార్యసేవారూపేణ భక్తితః ॥

సప్తద్వీప పరిమండిత అఖండ భూమండలంలో అంతర్భాగంగా నున్న ద్వీపకల్పమే మన భారతావని. ఉత్తరమున హిమాలయపర్వతశ్రేణి, మిగిలిన మూడు దిక్కుల సముద్రము హద్దులుగా నున్న ఈ భూభాగమంతా యుగయుగాలుగా దేవ-ఋషి-భూసుర క్షేత్రము, రత్నగర్భకూడ. అఖండ ఖనిజసంపదతో కూడినదై, అంగ, వంగ, కళింగ, కాశ్మీర, పాండ్య, చోళాది అరవై అయిదు ప్రాంతాలుగా మలచబడి, ఆయా ప్రాంతాలకు పరిపాలనా ధ్యక్షులుగా అనేకమంది చక్రవర్తులు, మహారాజులు ఆయా యుగాలలో రాజ్యాధినేతలుగా ఉంటూ, ప్రజల మన్నలను పొందేరు. మాంధాత, సగర, భగీరథ, అంబరీష, శిఖి, నల, భరతాది చక్రవర్తులెందరో కాలగర్భంలో కలసిపోయారు. వసిష్ఠ, వాల్మీకి, విశ్వామిత్ర, చ్యవనాది మహర్షులు, నన్నయ, తిక్కన, కాళిదాసు, ధూర్జటి శ్రీనాథుడు, భారవి మొదలగు మహాకవులు. శంకర, రామానుజ, రాఘవేంద్రులవంటి మతాచార్యులు, ఎందరో మహానుభావులు ఈ కర్మభూమిపై వారి వారి కాలాల్లో దేశసౌభాగ్యానికి, ప్రజాక్షేమానికి, మతసామరస్యానికి అవిరళ కృషి చేసారు. యుగధర్మాల ననుసరించి తపస్సులు, యజ్ఞయాగాలు, దానధర్మాలు, పుణ్యభూమిపై జరుగుతూ ఉండేవి.

యుగచక్రంలో సంభవించిన మార్పులవల్ల, ముఖ్యముగా కవియుగారంభం నుండి, చక్రవర్తుల, మహారాజుల, రాజుల, సంస్థానాధీశుల మధ్య పరస్పర వైషమ్యాలు పెరిగి, రాజ్యవిస్తరణ, అధికారదాహం, ధనాపేక్ష, కుటుంబకలహాల



వంటి సంకుచితప్రలోభాల ప్రభావం వల్ల ప్రజలలో సుఖశాంతులు క్షీణించాయి. దీనినదనుగా మలచుకొని తమ చిరకాల వాంఛలకు కార్యరూపాన్ని జోడించి భోగభూవాసులైన విదేశీయులు మనదేశంపై పలుమార్లు దండయాత్రలు చేసి, భీభత్సాలను సృష్టించి, సంపదలను కొల్లగొట్టి, పలుప్రాంతాలను వశపరచుకొని రాజ్యాధికారాన్ని చేజిచ్చుకొన్న వైనాలను చరిత్రకారులు స్పష్టపరిచేరు. సుఖశాంతులనే సదా కాంక్షించే ఆనాటి చక్రవర్తులు, మహరాజులు, సంస్థానాధీశులు వారి వారి శక్త్యనుసారం ప్రతిఘటనలు చేసినా, గజ, తురగ, పదాది సైన్యాలకు పరిమితమైన మన యుద్ధబలగము విదేశీ ముష్కరుల ఫిరంగి, తుపాకి బలగాలకి దాసోహమనక తప్పలేదు. ఈ పోరాటాలలో ముఖ్యముగా మగధ, మహారాష్ట్ర, రాజస్థాన్, చోళ, పాండ్య, కాకతీయాదిరాష్ట్ర దేశమహాయోధులు వీరస్వర్గాన్ని పొందారు.

తుదకు శాంతియుత విప్లవములగు సంఘటితపరచి, విదేశీ పెత్తనమునకు చరమగీతం పాడించి, దేశానికి సాతంత్ర్యంతో భారతావనికి దాస్యశృంఖలవిముక్తి కలిగించిన మహనీయులలో ముఖ్యుడు - మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ. దేశస్వాతంత్ర్యానంతరం నాటి రాజకీయ, సామాజిక పరిస్థితుల కనుగుణముగా ఢిల్లీ నగరాన్ని కేంద్రబిందువుగా చేసికొని ప్రజాప్రభుత్వ స్థాపనతో బాటు సుపరిపాలన, దేశాభివృద్ధిని ధ్యేయంగా చేసికొని పలు సంస్కరణలను ప్రవేశపెట్టి నిస్స్వార్థపరులైన మంత్రులను, ప్రజాప్రతినిధులను ఆయా రాష్ట్రాలకు పరిపాలకులను నియమించడం జరిగింది. పరిపాలనా సౌలభ్యానికి భాషా ప్రయుక్త రాష్ట్రవిభజన, రాచరిక, జమీందారి, సంస్థానాధిపత్య వ్యవస్థరద్దు వంటి మార్పులు జరిగాయి. ఆ ప్రక్రియలో మదరాసు రాష్ట్రంలో భాగంగా నున్న తెలుగు ప్రాంతాన్ని ప్రత్యేకరాష్ట్రంగా మలచటం జరిగింది. ఈ కొత్తరాష్ట్రంలో ఆగ్నేయదిశగా సముద్రతీరాన నున్న నగరాలలో **“విశాఖపట్టణం”** ఒక జిల్లా కేంద్రం. ఇచ్చటనే విమాన, నౌకాశ్రయాలతో బాటు ఉక్కు కర్మాగారం, ప్రఖ్యాత విశ్వవిద్యాలయం, వైద్య, విజ్ఞానసంస్థల యేర్పాటు కూడా జరిగాయి. తర్వాత, ఈదరిమిలా, ఇదే జిల్లాలోనే అంతర్భాగంగా నున్న **“విజయనగరం”** పట్టణాన్ని మరికొన్ని మండలాలతోనే కలిపి కొత్తజిల్లా కేంద్రంగా మలచటం జరిగింది.

ఈ **"విజయనగరం"** జిల్లా కేంద్రంగా మారకపూర్వం కొన్ని వందల సంవత్సరాలనుండి ఒక సంస్థానంగా ఉంటూ, పూసపాటి గజపతుల ఆధిపత్యంలో చాలా అభివృద్ధిని సంతరించుకున్నది. ఈ మహారాజులు ప్రజల క్షేమాన్ని సదా కాంక్షించుటయే గాక వారిలో చాలా మందిని ఆధ్యాత్మిక, విద్యా, వైజ్ఞానిక రంగాలతో బాటు నృత్యనాటక, క్రీడారంగాలలో కూడా చైతన్య పరచారు. అనేక విద్యాసంస్థలు, దేవాలయాలు నిర్మింపజేసి వాటి నిర్వహణకై సుదూరప్రాంతాలనుండి మేటి పండితులను కళాకారులను రప్పించి, వసతులను కల్పించి, సర్వతోముఖాభివృద్ధికి పటిష్ఠమైన పునాదులు వేశారు. కీర్తిశేషులు ఆదిభట్ల నారాయణదాసు, గురజాడ అప్పారావు, ద్వారం వేంకటస్వామి నాయుడు, శ్రీరంగం గోపాలరత్నం, అల్లూరి సీతారామరాజు వగైరా ఎందరో మహానుభావులు ఈ సంస్థానంలోనివారే. అలాగే ఆనాటి బహుముఖ ప్రజ్ఞాశాలులు, పరిపాలనాదక్షులు, శాంతికాముకులు, సంస్థానాధిపతులలో మేటియైన వారిలో కీర్తిశేషులు పూసపాటి విజయరామ గజపతి, అలకనారాయణగజపతి, ఆనంద గజపతి వగైరా మణిపూసలు చిరస్మరణీయులు. అయితే కొన్ని కుటుంబకలహాలను ఆసరాగ మలచుకొని ప్రక్కనేయున్న **"బొబ్బిలి"** సంస్థానాధిపతులతో అంతవరకునున్న చిన్న చిన్న అంతఃకలహాలను పెంపొందించి, రెండు సంస్థానాల మధ్య యుద్ధములను సృష్టించి, దేశంలో వ్యాపారం చేసుకొనే మిషతో ప్రవేశించిన విదేశీ ప్రభువులు లబ్ధిని పొందుటయే గాక, ఈ రెండు సంస్థానములను తమ అధీనములోకి తెచ్చుకొన్నారు.

ఈ విజయనగరానికి దక్షిణముగా సుమారు 15 కి.మీ.దూరంలో ఉన్న చిన్న కొండను ఆనుకొనియున్న తూర్పుకనుమలలోని గోవుపాదుగు ఆకారంలో నున్న పెద్దరాతి బండనుండి సంతతము వెలువడుతున్న జలధార చిన్న సెలయేరై జీవనదిగా మారి, **"గోస్తని"** పేర తన పరీవాహక ప్రాంతాన్ని సస్యశ్యామలం చేస్తూ, చివరకు విశాఖపట్టణం జిల్లాలోని భీముని పట్టణం ప్రాంతంలోని బంగాళాఖాతంలో విలీనం అవుతోంది. అప్పటిలో ఈ ప్రాంత మంతా పెద్దపెద్ద వృక్షాలతో నిండి దట్టమైన అరణ్యాన్ని తలపిస్తూ ఉండటం చేత జనావాసాలు ఉండేవికావు. ఈ ప్రాంతమే ఇప్పటి "పద్మనాభం" గ్రామం.



ఈ పేరు రావటానికి రెండు రకముల కథనములు వినిపిస్తున్నాయి. సుమారు ఆతేడు శతాబ్దాల పూర్వం విజయనగర సంస్థానాధిపతులలో నాటి మేటి ధీరుడైన పద్మనాభ గజపతిరాజు, దురాక్రమణకై దండెత్తివచ్చిన విదేశీ సైన్యాలను, యీ గోస్తనీ నదీతీరాన నిల్వరించి, వెనుకకు పారద్రోలాడని, దైవాత్తు అచిరకాలంలోనే స్వర్గస్థుడైనట్లున్నూ, వాని జ్ఞాపకంగా వాని పేరే ఈ ప్రాంతానికి దఖలు పడినట్లున్నూ చెప్పుకొంటారీ ప్రాంతీయులు.

ఇంకొక కథనం ప్రకారం - 18వ శతాబ్దానికి పూర్వమే జరిగిన సిపాయిల తిరుగుబాటు తదనంతరం సంభవించిన బొబ్బిలియుద్ధంలో అప్పటి పెద్ద విజయరామగజపతి మరణం **"రణస్థలం"** ప్రాంతంలోను, దాని పర్యవసానంగా వచ్చిన సంస్థానాధిపత్యమార్పులలో కుంటిసాకులతో సంస్థానంలో చొరబాటుకు ప్రయత్నించిన ఈ సిబ్బంది యా కంపెనీ బలగాలను ధైర్యంగా ఎదుర్కొన్న చిన విజయరామగజపతి ఈ **"పద్మనాభం"** ప్రాంతంలోనే వీరస్వర్గం అలంకరించినట్లు కొందరి కథనం. ఏదియేమైనా, ఈ యుద్ధాల తరువాతనే ఈ ప్రాంతం క్రమేణా జనావాసాలకు అనుగుణంగా మారడం సత్యం. మొన్నమొన్నటివరకు విజయనగరంజిల్లాలో అంతర్భాగంగా నున్న ఈ **"పద్మనాభం"** గ్రామం కారణాంతరాలవల్ల విశాఖపట్టణం జిల్లాలో చేర్చబడిందీ మధ్యనే.

కాలక్రమేణ అవిభక్త మదరాసు రాష్ట్రంలోని చెంగల్పట్టు, చిత్తూరు, నెల్లూరు, కృష్ణా, గోదావరివగైరా జిల్లాలనుండి కొన్ని అగ్రవర్ణకుటుంబాలు ఈ విశాఖపట్టణం విజయనగరం జిల్లాలకు వలసలుగా తరలివచ్చి ముఖ్యముగా సింహాచలం, పద్మనాభం, రామతీర్థం, శ్రీకూర్మం గ్రామాలకు పరిమితమై పూసపాటి గజపతుల సౌహార్ద్రతతో స్థిరనివాసాలేర్పరచుకొన్నారు. ఈ అగ్రవర్ణాలలో ముఖ్యముగా 15-20 శ్రీవైష్ణవ (తెంగల్, వడగల్), 20-30 బ్రాహ్మణ (నియోగ, వైదిక), 20-30 మోజారిటి (క్షత్రియ), 16-20 నాగవంశ కుటుంబాలు వెరసి సుమారు 100 గడపలుగా స్థిరపడ్డాయి. శ్రీవైష్ణవ, బ్రాహ్మణ కుటుంబాలవారు దేవాలయాలకు మొఖాసా, నాగవంశీయులు వ్యాపార వ్యవసాయాలకు పరిమితమైనారు. బ్రాహ్మణాదరణ, వితరణలకు, సంప్రదాయ పరిరక్షణలకు ఈ నాగవంశీయులు, మొఖాసాదారులు ఇప్పటికన్నీ ప్రతీకలుగా

ఉన్నారు. శ్రీవైష్ణవ కులాలవారు నాలాయిర దివ్యప్రబంధ పారీణులే కాక, వాచోవిధేయులు. భారత భాగవత రామాయణాది పురాణాలలోనూ, ఆగమ శాస్త్రాలలోను ఆయుర్వేద వైద్యంలోను కూడా నిపుణులు. సంస్కృతభాషను, నాల్గు వేదాలను కూడా ఆపోశన పట్టినవారు.

ద్వాపరయుగాంతంలో కురుక్షేత్ర సంగ్రామానికి పూర్వం విధివశాన పాండవుల అరణ్య అజ్ఞాతవాస కాలంలో వారి మాతృమూర్తి కుంతీదేవి తన పుత్రుల దైన్యావస్థకు మిక్కిలి కలత చెంది, దివ్యదేశాటన నెపంతో అనేకదేశాలు తిరుగుతూ, తన మేనల్లుడైన శ్రీకృష్ణుణ్ణి సతతం స్మరిస్తూ, తన వంశాన్ని రక్షించి, ఆ పదవిముక్తి కలిగించమని ప్రార్థిస్తూ, తాను తిరిగిన కొన్ని ముఖ్యప్రదేశాలైన వారణాసి, గయ, ప్రయాగ, పీఠికాపురులలో గోపాలమూర్తి శిలావిగ్రహాలను వరుసక్రమంలో వేణు, సేతు, బిందు, సుందర మాధవులనే పేర్లతో ప్రతిష్ఠింపజేసింది. ఆ దేశాటన ప్రక్రియలో యాదృచ్ఛికంగా యీగోస్తనీ తీరానికి వచ్చి పద్మనాభంతో తన పేరును కూడా చేర్చిన కుంతీమాధవమూర్తిని ప్రతిష్ఠింపజేసింది. ఇవే పద్మనాభగ్రామ నడిమిలో నున్న చిన్నకొండపై సాలగ్రామ శిలాకృతిలో శంఖ చక్ర తిరుమణి చిహ్నాలతో ఒక పెద్ద పణుకు (బండ), దానిని చుట్టుకొని విచ్చిన పడగాకృతితోనున్న సర్పము దర్శనమిస్తాయి. దీనినే స్వయం విలసిత అనంతపద్మనాభస్వామియని దేవతలు, ఋషులు యుగయుగాల నుండి ఆ స్వామిని ఆరాధించేవారని ప్రతీతి. ఈ శిలాకృతిలోనున్న స్వామిని ఏ యుగంలో ఏ భాగవతోత్తములు బహిర్గతం చేసారో తెలియదు కాని, చాలా ప్రతిభామూర్తియని మాత్రము ప్రతీతి. భక్తిశ్రద్ధలతో అర్చించినవారికి అచిరకాలంలోనే సంతానప్రాప్తిని, సంపదభివృద్ధిని కలిగిస్తాడన్న జనోక్తికి అనేక తార్కాణాలు నేటికి ఉన్నాయి. పాండవులు తమ తల్లితోబాటు ఈ అనంతపద్మనాభస్వామిని, కుంతీమాధవస్వామిని సేవించుకొని వెనుకకు మరలి హస్తిన చేరుకొన్న పిమ్మటనే రాయబార ప్రయత్నము, విఫలము, కురుక్షేత్ర సంగ్రామము, ధర్మరాజపట్టాభిషేకము జరిగేయని ప్రజల విశ్వాసము. స్కాందపురాణాంతర్గతమైన ఈ క్షేత్రమాహాత్మ్యం మూలం ఇప్పటికి సుమారు నూఱు సంవత్సరాల పూర్వం తెలుగు లిపిలో ముద్రింపబడింది. అది ఇపుడు దుర్లభం.



పాండవుల నిష్క్రమణానంతరం ఈ కొండమీద దిగువన యున్న దేవతామూర్తులు కాలగర్భంలో మరుగైనాయి. పుట్టలు, చెట్లు దట్టంగా పెరిగాయి. అయితే మరి కొంతకాలానికి యీ ప్రాంతపు పశువుల కాపర్లు తమ తమ పశువులను మేతకై త్రిప్పుతున్న తరుణంలో, మందలోనున్న ఒక గోవుమాత్రము కొండపైనున్న పుట్టల మధ్యలో పణుకు రూపంలో నున్న బండవద్ద నిలచి నిత్యము తన క్షీరాలను విడిచేదిట. పశువుల కొట్టంలో మాత్రం ఇతర గోవులకు భిన్నంగా క్షీరాలు లేని పొదుగుతో నుండేదట. ఈ వింతను కన్నయ్య అనే పశువుల కాపరి కనిపెట్టి, ఓ రోజు రహస్యంగా ఆ గోవును వెంబడించి జరుగుతున్న దృశ్యాన్ని చూచి ఆశ్చర్యపడి, మరునాడు తన సహచరుల సహాయంతో ఆ ప్రదేశాన్ని శుభ్రపరుస్తున్న సమయంలో ఈ శిలారూప బంఢను చూచి, ఆ ప్రక్కనే సుగంధభరిత గోక్షీరసువాసలకు ముగ్ధుడై, తనదైన సహజ భక్తితో సాష్టాంగబడి, తదారభ్య, ప్రతిరోజూ తన సహచరులతో సమిష్టిగా పూజలు, నైవేద్యాలు ఆ పణుకు వద్ద సమర్పించేవాడట. ఇలా కొంతకాలం జరిగిన పిదప ఓరోజు అప్పటి విజయనగర సంస్థానాధీశుడైన విజయరామగజపతికి స్వప్నములో పద్మనాభస్వామి కనబడి, తన ఉనికిని తెలియబరచి ఆ ప్రాంతంలో ఆలయనిర్మాణం, ఆరాధన చేయించమని ఆదేశించేడట. వెంటనే ఆ రాజుగారు వేదపండితులను, పరివారాన్ని వెంటబెట్టుకొని కొండమీద, కొండదిగువన నున్న మూర్తులను గుర్తించి, శాస్త్రోక్తంగా ప్రతిష్ఠాకార్యక్రమాలను పూర్తిచేసి నిత్యదీప, ధూప, ఆరాధన నైవేద్యాది సేవలకు ఏర్పాట్లు చేయించారని స్థానికుల కథనం. అంతవరకు సేవించిన ఆ పశువుల కాపరికి ప్రతిఫలంగా కొంత భూమిని ఇనాముగా ఇవ్వడమే కాక అతనికే పరిసరప్రాంత సంరక్షణబాధ్యతను ఆరాజుగారిచ్చేరట. పద్మనాభానికి కూతవేటు దూరంలోనే ఈ పశువుల కాపరి నివసించుటచేతను, కొంతకాలం కొండమీద స్వామికి పూజలు చేయుటచేతను ఆప్రాంతానికి అర్చకుని పాలేకునే పేరు స్థిరపడింది. అలాగే, ఈ గిరికి ఈశాన్యంలోనున్న చిన్న చెరువును కన్నయ్యకోనేరని ఈనాటికిని చెప్పుకొంటారు. ఈ అర్చకుని పాలెంగ్రామ వాసులు నేటికిన్నీ తమ తమ పశువుల మొదటి ఈత పాలను కొండమీదస్వామికి నైవేద్యంగా సమర్పించటం ఆనవాయితీ.

ఆనాటి విజయనగరసంస్థానాధీశులు పూసపాటి మూడవ విజయరామ గజపతి, అభినవ ఆంధ్రభోజబిరుదాంకితుడైన ఆనందగజపతి అలాగే, అప్పటి నిస్స్వార్థపరుడు, ప్రజాశ్రేయాభిలాషి, దైవచింతన కలిగిన పెన్మత్స జగన్నాథ రాజుగార్ల నిరంతర ఆధ్యాత్మిక కృషిఫలితంగా కొండమీద ఆలయనిర్మాణం, మెట్లదారి, అలాగే కొండదిగువన ఆలయనిర్మాణం, విశాలప్రాంగణాల ఏర్పాటు. శ్రీకృష్ణులతోబాటు రుక్మిణీ సత్యభామ సమేత వేణుగోపాల, రామానుజ, పరాంకుశ, సుదర్శనాది పంచలోహ ఉత్సవమూర్తుల ప్రతిష్ఠ, నిత్యదీపధూప నైవేద్య ఆరాధనల నిమిత్తం తగు పరవార నియామకం, వీటికవసరమైన ఆదాయవనరులను కల్పించారు. తదారభ్య కొండపైని, దిగువననున్న ఆలయాలలో నిర్విఘ్నంగా విశేషార్చనలు జరిగేవి. కొండపైన నీటి వనరులు లేకపోవుటచే క్రిందినుండే అవసరపరికరములను తీసుకొని పూజాదికాలు ఇప్పటికీ నిర్వర్తించుట ఆనవాయితీగా ఉన్నది. ప్రతి భాద్రపద శుద్ధ చతుర్దశినాడు అత్యంత వైభవంగా కొండపై నున్న స్వామికి విశేషోత్సవము జరుగుతుంది. దీనినే అనంతపద్మనాభ చతుర్దశి అంటారు. ఆనాడు స్వామిదర్శనానికై చుట్టుప్రక్కల గ్రామాలవారే గాక దూరప్రాంతాలనుండి వేలసంఖ్యలో భక్తులు వచ్చి పూజాదికాలు చేసుకొని స్వామికి మొక్కులు చెల్లిస్తారు. ఈ స్వామి అత్యంత మహిమాన్వితుడనీ, భక్తితో అంజలి ఘటించి ప్రార్థించినంతమాత్రాన కోరికలను నెరవేర్చుతాడని, పేరు పెట్టి పిలిచినంత మాత్రాన పలికే స్వామి అనీ, భక్తుల ధృడవిశ్వాసము. అలాగే ప్రతికార్తీక బహుళ అమావాస్య సంధ్యాసమయంలో కొండమెట్లపై యిరువైపుల లక్షలాది దీపాలను భక్తులు వెలిగించుట ఇప్పటికీ ఆనవాయితీ. ఈదీపారాధన దృశ్యం అత్యంత మనోహరంగా ఉంటుంది.

తరాల మార్పు, సంకుచిత స్వభావ విజృంభణ, స్వార్థపుంతరాజకీయ పరిణామాలు, పర్యవేక్షణ లోసుగులు మొదలైనవాటి ప్రభావం ఈ ఉభయ దేవాలయాల మీద బాగా పనిచేసి పూర్వవైభవానికి అంతరాయం ఏర్పడింది. కాని మానవుడు ఆశాజీవి. భగవంతుని అనుగ్రహం అంతు లేనిది. అగుట వలనేమో, పరిస్థితులలో చిన్న చిన్న మార్పులు జరుగుతున్నాయి. కనుక ఈ



వైభవం పునరుద్ధరింపబడుతుందని చిరకాలంలోనే యన్న ఆశాభావాలు ఇప్పుడిప్పుడే చిగురిస్తున్నాయి. ఇది శుభపరిణామం.

ఒకప్పటి పద్మనాభగ్రామవాస్తవ్యులు, పండితరేణ్యులు, కీర్తిశేషులైన ఉ.వే. శ్రీమాన్ తిరుమల పెద్దింటి జనార్దన నృసింహాచార్యస్వామివారు రచించిన "అనంతపద్మనాభ", "పృథామాధవ" సుప్రభాత శ్లోకాలను, అలాగే ఒకప్పటి రామతీర్థ గ్రామవాస్తవ్యులు, విద్వద్వరేణ్యులు, ఆయుర్వేద విద్వాంసులు అయిన కీర్తిశేషులు ఉ.వే. శ్రీమాన్ తిరుమల పల్లేర్లమూడి రామానుజస్వామివారు ఈ పద్మనాభస్వామివారి విషయంగా తమిళభాషలో కృపచేసిన ప్రార్థన పాశురము లను తాత్పర్యసహితముగా సామాన్య ప్రజానుసంధానానికి అనుగుణంగా ఉండాలనే తపన, ప్రేరణల ఫలితంగా ఇందులోనే పొందుపరచుట జరిగింది. అవకాశానుసారంగా భక్తులు పఠించి దైవానుగ్రహాన్ని పొందగలరు. ఈ సుప్రభాత స్తోత్రాలకు, పాశురాలకు తాత్పర్యాన్ని సమకూర్చిన సహృదయులు, ఉ.వే.శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామి (తిరుపతి) వారికి హృదయపూర్వక కృతజ్ఞతలు. గ్రంథాన్ని అందంగా సిద్ధంచేసిన శ్రీమతి జయలక్ష్మిగారికి, శ్రీ చంద్రశేఖర్ గారికి, మనోహరంగా ముద్రించిన శ్రీహర్షవర్ధన్ గారికి అనేక కృతజ్ఞతలు.

"గోస్తనీతీరవాసాయ మాధవాయ మహాత్మనే ।
శ్రీభూనీళాసమేతాయ (అనంత)పద్మనాభాయ మంగళమ్ ॥

కృతదర్పమయం దేవం శ్వేతద్వీపే స్థితం హరిమ్ ।
సమన్వితం సప్తఫణైః పింగళాక్షం చతుర్భుజమ్ ॥
దారిద్ర్యనాశనార్థాయ పుత్రపౌత్రప్రకర్షయే ।
అనంతాఖ్య మిదం సూత్రం ధారయామ్యహ ముత్తమమ్ ॥"

భాగవత దాసుడు

**టి.పి.వి. రమణ**

ఉ.వే.ప్ర.శ్రీమాన్ తిరుమల పెద్దింటి జనార్దన నృసింహాచార్యులవారు
(పద్మనాభం) రచించిన

# శ్రీమదనంత పద్మనాభ సుప్రభాతమ్

(ఈ సుప్రభాత స్తుతిలోని శ్లోకాలలో వరుసగా అచ్చులు అకారాది క్రమంలో కూర్చబడడం గమనించవచ్చు.)

1. **అత్యంతసుందరపురందర దిగ్వధూటీం**
**శైలాగ్రరక్తతరణి స్సముపైతి మందమ్ ।**
**శ్రీమత్పదాంబురుహా! పుష్పరసైకలోల !**
**శ్రీపద్మనాభ! కమలేక్షణ! సుప్రభాతమ్ ॥**

చాలా అందమైన, తూర్పు దిక్కు (అనే కాంత)ను ఉదయగిరి శిఖరంపై రాగాన్ని (ప్రేమను, ఎఱ్ఱని రంగును) కల సూర్యుడు మెల్లగా చేరుతున్నాడు. అందమైన తామరపూలవంటి పాదాలను కలవాడా! పుష్పాలంకరణలో అద్వితీయమైన ఆనందాన్ని కలవాడా ! తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ ! సుప్రభాతం.

2. **ఆశాసు సక్త మతిసాంద్ర తమో వియుక్తం**
**పుష్పాణి పుష్పరసవంతి హసంతి మందమ్ ।**
**ఇందిందిరాః కమలపుష్పరసైకలోలాః**
**శ్రీపద్మనాభ! కమలేక్షణ! సుప్రభాతమ్ ॥**

దిక్కులలో మిక్కిలి దట్టంగా వ్యాపించిన చీకటి తొలగిపోయింది. తేనెను నిండుగా కల్గిన పూలు మెల్లగా వికసిస్తున్నాయి. తేనెటీగలు (తుమ్మెదలు) తామరపూలలోని మకరందాన్ని ఆస్వాదించడంలో ఆసక్తిని కల్గినవి అయ్యాయి. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ! సుప్రభాతం.



3. **ఇంద్రాదిదిక్పతిసమేత ఉపాగతోసౌ**
**ధాతా త్వదీయపదపంకజచిత్తవృత్తిః ।**
**హస్తీశ్వరో విజయరామనృపాల ఏషః**
**శ్రీపద్మనాభ! కమలేక్షణ! సుప్రభాతమ్ ॥**

ఇంద్రుడు మొదవలైన దిక్పాలకులతో కలసి ఈ బ్రహ్మ నీ పాదపద్మాలపై నిమగ్నమైన మనస్సును కలవాడై వచ్చాడు. విజయరామ గజపతి ప్రభువు నీ సేవకు వచ్చాడు. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ ! సుప్రభాతం.

4. **ఈహాం విసృజ్య విషయేషు భవత్పదాబ్జ-**
**లోలా యతీంద్రనివహా స్సుకృతాభిషేకాః ।**
**శ్రీవైష్ణవైస్సహ కృతాంజలయ స్సమేతాః**
**శ్రీపద్మనాభ! కమలేక్షణ! సుప్రభాతమ్ ॥**

లౌకిక విషయాలలో ఆసక్తిని విడచినవారు, నీ పాదారవిందాలలో ఆసక్తిని కలవారైన గొప్ప యతుల సమూహాలు చక్కగా స్నానం చేసినవారై, అంజలిని ఘటిస్తూ శ్రీవైష్ణవ సమూహంతో పాటు నీ సేవ కోసం వచ్చారు. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ! సుప్రభాతం.

5. **ఉల్లాసమస్తక నివేశితచారుశుణ్డా-**
**దణ్డావలంబిసుమనోహరపంకజాతాః ।**
**దంతావళాస్తు భవదీయపదాబ్జలోలాః**
**శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥**

భద్రగజాలు అందమైన తామరపూలను తమ పొడుగైన తొండాలతో గ్రహించి, వానిని తమ కుంభస్థలాలపై సంతోషంగా పెట్టుకొని, నీకు సమర్పించాలని నీ పాదపద్మాలలో భక్తిని కల్గినవై ఉన్నాయి. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ! సుప్రభాతం.

6. ఊహాతిరిక్తనినదాస్వరవానునాది -
వీణాప్రకృష్టమధురధ్వనినా సమేతమ్ ।
లాస్యం ప్రవృత్త మధునాఽప్సరసాం గణానామ్
శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

గానం చేసేటపుడు పుట్టిన ఊహాతీతంగా ఉండే ధ్వనిని కల కంఠరవానికి అనుగుణంగా ఉన్న గొప్ప వీణలనుండి పుట్టిన మధురమైన ధ్వనితో కూడినదైన అప్సరస సమూహాల నాట్యం నీ సేవలో భాగంగా ఆరంభమైనది. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ! సుప్రభాతం.

7. ఋక్సామనీలసితయాజుషవేదమంత్రా-
థర్వశ్రుతి ప్రపఠనోన్నతరమ్యకంఠాః ।
పృథ్వీసురాః కృతజలాభిషకా స్సమేతాః
శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

ఋగ్వేద, సామవేద, కృష్ణయజుర్వేద, శుక్లయజుర్వేద మంత్రాలను, అధర్వణ వేదమంత్రాలను పఠించే మధురమైన కంఠధ్వనిని కల విప్రులు స్నానం చేసినవారై, ఇక్కడకు వచ్చారు. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ! సుప్రభాతం.

8. ఋూవర్ణసంకలిత షడ్జవిశేషణాది-
చంచూపుటాః ప్రసృతిచిత్రకలాపభారాః ।
నృత్యంతి దుందుభిరవాకలనాన్మయూరాః
శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

షడ్జస్వరాన్ని "ఋూ" అనే వర్ణం యొక్క ఆకారంలో ఉండే, పలికేవి అయిన నాసికా (ముక్కు) పుటాలను కల్గినవై, విస్తరించిన, ఆశ్చర్యాన్ని కల్గించే పింఛభారాన్ని కల్గినవైన నెమళ్ళు దుందుభి అనే మంగళవాద్యధ్వనిని విని అది మేఘగర్జనగా తలచి నాట్యంచేస్తున్నవి. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ! సుప్రభాతం.



9. ఌతోఽతిసన్నిహితదంత్యసువర్ణమిశ్ర-
నాదానుకారికలహంసవిశేషనాదాః
త్వత్పాదపంకజవిలోలతయేవ భాంతి
శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

ఌ - అనే వర్ణాలతో మిక్కిలి సన్నిహితాలైన దంత్యవర్ణాలతో కూడిన నాదాన్ని పోలిన గొప్ప కలహంసల నాదాలు నీ పాదపంకజాల పట్లగల మిక్కిలి ఆసక్తి వల్లనా? అనేటట్లు తోస్తున్నవి. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ! సుప్రభాతం.

10. ఏలాలవంగవరజాతిసుగంధపుష్ప-
సమ్మిశ్రితాతిమధురామలతీర్థకుంభాన్ ।
ఆనీయ తస్థు రధునా భవదర్చకాస్తు
శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

యాలకులతో, లవంగాలతో, గొప్పజాతికి చెందిన సువాసనను కల, పూలతో కూడిన తీయని స్వచ్ఛమైన తీర్థాన్ని కల కలశాలను తీసికొని వచ్చిన అర్చకులు వేచి ఉన్నారు. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ! సుప్రభాతం.

11. ఐశ్వర్య మద్య భవదీయపదారవింద
సేనాదిలభ్య మితి కేచన తావకీనమ్ ।
నామ్నాం సహస్ర మధునా పఠితుం సమేతాః
శ్రీపద్మనాభ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

దేవరవారి పాదారవింద సేవవల్ల ఐశ్వర్యం లభిస్తుందని కొందఱు నీ సహస్ర నామస్తుతిని పఠించడంకోసం ఈనాడు వచ్చారు. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ ! సుప్రభాతం.

12. ఓంకారనాద్యతిగభీరనినాదఘంటాః
భేరీమృదంగపటహోజ్జ్వసువేణునాదాః ।

తత్త్రద్రవైకనిపుణైః ప్రకటీకృతా స్స్మ
శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

ఓంకార నాదాన్ని కల, మిక్కిలి గంభీరమైన శబ్దాన్ని కల ఘంటలు, భేరి, మృదంగం, పటహం, శంఖ, వేణు మొదలైన వాద్యపరికరాలు, ఆయా వాద్యాలను వాయించడంలో నిపుణులైనవారిచే వాయింపబడ్డాయి. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ ! సుప్రభాతం.

13. ఔదార్య మాశ్రితవిభీషణవానరేంద్ర-
కాళీయకాకవిజయాది సురక్షణేన ।
సర్వత్ర సుప్రథిత మద్య కథన్ను శేషే?
శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

నీ ఔదార్యగుణం, నిన్ను ఆశ్రయించిన విభీషణుడు, సుగ్రీవుడు, కాళీయుడు, కాకాసురుడు, అర్జునుడు, మొదలైనవారిని రక్షించడం వల్ల సర్వత్ర ప్రసిద్ధమైనది. ఇక ఎందుకు నిద్రిస్తున్నావు? తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ ! సుప్రభాతం.

14 అంభోజతోஉతిసుకుమారతరా త్వదీయ-
స్వాంతాశ్రితాఖిలజగజ్జననీ తు పద్మా ।
త్వద్గర్భదివ్యభువనం భవదీక్షణీయం
శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

పద్మంకంటే మిక్కిలి సుకుమారమైనది, సకలలోకమాత అయిన లక్ష్మి నీ హృదయాన్ని ఆశ్రయించి ఉన్నది. నీ ఉదరంలో ఉండే దివ్యమైన భువనాన్ని నీవిక కటాక్షించాలి. తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ! సుప్రభాతం.

15. అత్యంతసుందరగభీరజలోద్గతశ్రీ-
నాళావలంబిరవిభాసవికాసితాబ్జమ్ ।



కిన్ను త్వదీయవిమలాయతనేత్రతుల్యం
శ్రీపద్మనాభ ! కమలేక్షణ ! సుప్రభాతమ్ ॥

మిక్కిలి అందమైన, లోతైన నీటిలోనుండి పుట్టినది, అందమైనవాడను ఆధారంగా కల్గినది. సూర్యుని కాంతిచే వికసించినదైన తామరపూవు సైతం విమలమైన, విశాలమైన నీ నేత్రాలతో సమానమా ! కాదుకదా ! తామరలవంటి నేత్రాలను కల పద్మనాభస్వామీ ! సుప్రభాతం.

ఉ.వే.ప్ర.శ్రీమాన్ తిరుమల పెద్దింటి జనార్దన నృసింహాచార్యులవారు
(పద్మనాభం) రచించిన

# శ్రీపృథామాధవ సుప్రభాతమ్

( ఈ స్తుతిలోని శ్లోకాల ఆరంభంలో వరుసగా ద్వాదశ నామాలు కూర్చబడడం గమనించవచ్చు.)

1. శ్రీకేశవానంతదిగంతరాళం
తమోగతం భానుకరాతిభీతమ్ ।
దిశః ప్రసన్నా నళినీ తుతోష
స్వామిన్ ! పృథామాధవ ! సుప్రభాతమ్ ॥

ఓ కేశవా ! అనంతా ! దిక్కుల మధ్యలో ఉండే చీకటి సూర్యుని కిరణాలకు భయపడి తొలగిపోయింది. దిక్కులు స్వచ్ఛంగా ఉన్నాయి. పద్మాలు వికసించాయి. స్వామీ ! కుంతీమాధవా ! నీకు సుప్రభాతమ్.

2. నారాయణ! త్వత్పదపంకజాంత -
ర్నివేశితాంతఃకరణం కరీంద్రమ్ ।
శ్రుత్వా భవద్రక్షితమేత్య తస్థు
రార్తాః పృథామాధవ ! సుప్రభాతమ్ ॥

నారాయణా ! నీ పాదపద్మాలలో లగ్నమైన మనస్సును కల్గిన గజేంద్రుని నీవు రక్షించావు - అని తెలిసి ఆర్తులందఱు నీకోసం వచ్చి ఉన్నారు. స్వామీ ! కుంతీమాధవా ! నీకు సుప్రభాతమ్.

3. శ్రీమాధవ ! త్వాం హృదయాబ్జమధ్యే
బద్ధ్వా మునీంద్రా స్తు న నిఃశ్వసంతి ।
పద్మాలయాం త్వన్మనసిస్థితాం వా
శ్రుత్వా ! పృథామాధవ ! సుప్రభాతమ్ ॥

మాధవా! మునీంద్రులు, నిన్ను హృదయకమలం మధ్యలో నిలుపుకొన్నందు వల్లనా? లేక, నీ మనస్సులో పద్మాలయ అయిన లక్ష్మీదేవి ఉన్నదని విన్నందునా? నిశ్శ్వాసాన్ని విడువడంలేదు. స్వామీ! కుంతీమాధవా! నీకు సుప్రభాతమ్.

4. గోవింద ! గోపాలగణా శ్చ సర్వే
గవాం గణాన్ గోచరఘాసదేశాత్ ।
నీత్వా వ్రజం సందుదుహుః కిమర్థం
శేషే? పృథామాధవ! సుప్రభాతమ్ ॥

గోవిందా! గోపాలకులు అందఱు గోవుల సమూహాలను గోవులు తిరిగే పచ్చిక బయళ్ళనుండి రేపల్లెకు తీసికొని పోయి పాలు పితికారు. ఇంకా ఎందుకు నిద్రిస్తున్నావు? స్వామీ! కుంతీమాధవా! నీకు సుప్రభాతమ్.

5. విష్ణో త్వదీయాంఘ్రిసరోజగంధ-
మరందలోలాః కిల చంచరీకాః ।
నైక్షంత ఫుల్లాన్యపి చంపకాని
స్వామిన్ ! పృథామాధవ ! సుప్రభాతమ్ ॥

విష్ణూ ! నీ పాదపద్మాలలోని సువాసనలో, మకరందంలో ఆసక్తిని కల్గినవి అయినందున తుమ్మెదలు బాగా పూసిన సంపెంగపూలను కూడా చూడడం లేదు. స్వామీ ! కుంతీమాధవా ! నీకు సుప్రభాతమ్.



6. శ్రీమన్ ! మధుధ్వంసన! సప్తతంత్రీ-
వీణాం స్వకీయాం క్వణయన్నుపైతి
శ్రీనారద స్తుంబురుణా సమేతః
స్వామిన్! పృథామాధవ ! సుప్రభాతమ్ ॥

ఓ మధుసూదనా! తన సప్త తంత్రుల వీణను వాయిస్తూ నారదమహర్షి తుంబురునితో పాటుగా వస్తున్నాడు. స్వామీ! కుంతీమాధవా! నీకు సుప్రభాతమ్.

7. త్రివిక్రమాబ్జాసన శోధితశ్రీ -
పాదారవిందామృతవారిధారామ్
ధృత్వా కపర్దీహ సుపూత ఏతి
స్వామిన్ ! పృథామాధవ ! సుప్రభాతమ్ ॥

త్రివిక్రమా! బ్రహ్మ కడిగిన నీ పాదారవిందామృతధారను (శ్రీపాద తీర్థాన్ని) శివుడు ధరించి మిక్కిలి పవిత్రుడై వస్తున్నాడు. స్వామీ! కుంతీమాధవా! నీకు సుప్రభాతమ్.

8. శ్రీవామనాత్మన్! స్వస్వగేహశోషాత్
ఖద్యోతధూతోఽపి కలానిధిః కిమ్ ।
త్వదీక్షణ స్వాంతజితో భియాస్తః
స్వామిన్ ! పృథామాధవ ! సుప్రభాతమ్ ॥

వామనా ! తన సోదరి అయిన లక్ష్మీదేవి గృహమైన (పశ్చిమ) సముద్రం ఇంకిపోయినందున, సూర్యునిచే వెలవెల పోయినందున, నీకన్నుల అందాన్ని చూచి భయపడినందున చంద్రుడు అస్తమించడా ఏమి? శ్రీమాన్! నీకు సుప్రభాతం.

9. శ్రీ శ్రీధరాంభోజసుగంధితాత్మా
సుఫుల్లకుందాని చ సంప్రగృహ్య ।
త్వాం సేవతే క్షీరనిధే స్సమీరః
స్వామిన్ ! పృథామాధవ ! సుప్రభాతమ్ ॥

శ్రీధరా ! తామరపూల సుగంధాన్ని కల్గినదైన పాలసముద్రంనుండి వచ్చిన వాయువు చక్కగా పూచిన కుందపుష్పాలను తీసికొని వచ్చి నిన్ను సేవిస్తున్నాడు. స్వామీ ! కుంతీమాధవా ! నీకు సుప్రభాతమ్.

**10.** **శ్రీమన్ ! హృషీకేశ! సురాజహంసాః**
**స్వమానసాంభోజవనం త్వదీయే ।**
**పాదారవిందే సుఖ మర్పితుం వాఽ**
**గతాః పృథామాధవ ! సుప్రభాతమ్**

శ్రీమన్! హృషీకేశా! రాజహంసలు (యతులు తమ మనస్సులనే తామరపూల సమూహాలను నీ పాదారవిందాలలో సమర్పించాలని వచ్చారు. స్వామీ! కుంతీమాధవా ! నీకు సుప్రభాతమ్.

**11.** **శ్రీపద్మనాభాసితకాంతిపూరా-**
**గర్తే పతేయంత్వితి భీతభీతః ।**
**పద్మోద్భవ స్త్వత్పురత స్సమేతః**
**తస్థౌ పృథామాధవ ! సుప్రభాతమ్ ॥**

పద్మనాభా ! నీ నల్లని తిరుమేని కాంతి ప్రవాహంలోని సుడిగుండంలో పడిపోతానేమో! అనే భయంతో మిక్కిలి భయపడినవాడైన బ్రహ్మ నీ ముందుకు వచ్చి నిలుచుని ఉన్నాడు. స్వామీ ! కుంతీమాధవా ! నీకు సుప్రభాతమ్.

**12.** **దామోదర స్త్వం తు యశోదయా ప్రాక్**
**కృతస్త్వితి త్వత్పితృసోదరీ త్వామ్ ।**
**పద్మాచలే భక్తజనావనాయ**
**విన్యక్షిపన్మాధవ! సుప్రభాతమ్ ॥**

పూర్వం నిన్ను నీ తల్లి యశోద బంధించిందని, నీ మేనత్త కుంతీదేవి కూడా నిన్ను పద్మనాభ పర్వతంపై భక్తరక్షణకోసం ప్రతిష్ఠించింది. స్వామీ! కుంతీమాధవా! నీకు సుప్రభాతమ్.





ఉ.వే. శ్రీమాన్ తిరుమల పల్లేర్లమూడి రామానుజస్వామివారు రచించిన

# శ్రీపద్మనాభస్వామి విషయమాన పత్తు

**1.** **ఆములై నిన్ఱు శొరియు మాఱ్ఱిన్ కరైయిన్ నీళ్మలై**
**పూమిమకళ్ ములైపోలే పొరున్ద నిఱ్క అదన్మేల్ ।**
**తామమాక ఆఴియోడుమ్ తణ్శఙ్గుపిరాట్టియోడుమ్**
**శేమమాక అనన్దన్మేల్ శాయ్న్ద నమ్బి పఱ్పనాబనే ॥**

గోస్తనీ నదీ తీరంలో ఉన్నతమైన పర్వతం భూదేవిస్తనం వలె అందంగా భాసించగా, ఆ పర్వత శిఖరంపై నివాసాన్ని కల్గి, శ్రీసుదర్శనంతో, చల్లని పాంచజన్యంతో సుఖంగా అనంతునిపై శయనించిన కల్యాణగుణపూర్ణుడు-పద్మనాభస్వామి.

**2.** **అనన్దనురువిల్ తన్నురువై యఴుకాక కలప్పినిన్ఱు**
**అనన్ద పఱ్పనాబనెన్ఱుమ్ అమ్పేరాల్ అఴైప్పడుమ్ ।**
**తనదుపత్తర్ తలైవనార్క్కుమ్ తనక్కుమ్ పేదమిల్లై యెన్ఱు**
**అనైవర్క్కుమ్ కాట్టుమ్ తెయ్వమ్ అనన్దపఱ్పనాబనే ॥**

అనంతుని రూపంలో తన రూపాన్ని అందంగా యోజన చేసి, అనంత పద్మనాభుడనే అందమైన నామంతో పిలువబడేవాడు, తన భక్తుల నాయకుడైన అనంతునకు, తనకు తేడా లేదని అందఱికి చూపే దైవం- పద్మనాభస్వామి.

**3.** **తాన్ తొట్టియ వరైయినుచ్చి తన్ పత్తరనైవరు మేఱి**
**తాన్తొఴుకిల్లార్కళెన్ఱు తన్నరుళాల్ మలైయరుకే ।**
**కున్తియాల్ ఒరుకాలత్తు కొణ్డాన్ పూజై యెన్ఱదనాలే**
**కున్ది మాదవనెన్ఱు పేరై కొణ్డు నిఱ్కుమ్ పఱ్పనాబనే ॥**

తాను అధిరోహించి ఉండే పద్మనాభపర్వతశిఖరాగ్రాన్ని తన భక్తులందఱు ఎక్కి, తనను దర్శించుకోలేరు - అని తలచి, దయతో పర్వత సమీపంలోనే

కుంతీదేవిచే ఒకానొక సమయంలో పద్మనాభస్వామి కుంతీ మాధవుని రూపంలో ప్రతిష్ఠింపబడి, పూజలందుకొంటున్నాడు. అందువల్ల కుంతీమాధవుడనే పేరుతో వేంచేసి ఉండే స్వామి - పద్మనాభుడు.

4. విశయనగరత్తరశరాల్ విరున్దు తొ*ళ*ప్పడుమవన్
విశయమవర్క్కు త్తన్దిట్టు వేట్కైయాల్ కాక్కుమమ్మాన్ ।
నశైయుళ్ల పత్తరెల్లామ్ నమ్బి తొ*ళు*మ్ పాదత్తాన్
వశమాక్కి యవరై కాక్కుమ్ వళ్లల్ శీర్ పఱ్పనాబనే ॥

విజయనగర ప్రభువులచే భక్తితో సేవింపబడేవాడు, ఆ విజయనగర ప్రభువులకు విజయాన్ని కల్గించి, ప్రేమతో వారిని రక్షించే స్వామి, ఆశనుకల భక్తులందఱు విశ్వసించి సేవించే శ్రీచరణాలను కలవాడు, వారిని తన వశం చేసికొని రక్షించే ఉదారుడు- కల్యాణగుణాలను కల పద్మనాభస్వామి.

5. ఒరుపాలాఱు పాయ మ*ఱ్ఱ*యొరుపాల్ వరైయుమాక
తిరు వమర్న్దు నీళాక తిరువీదిగళ్ పడైత్తిడుమ్ ।
పెరియ వైట్టణవరవరాలే పేర్న్దు మల్కుమ్ తిరుప్పదియిల్
కరుమత్తై పత్తరానార్క్కు కడైత్తాన్ తాన్ పఱ్పనాబనే ॥

ఒకవైపు గోస్తనీనది ప్రవహించగా, ఇంకొకవైపు పర్వతం నిలచి ఉండగా, సంపదను కల్గిన, విశాలమైన, పొడుగైన తిరువీథులను కల్గినది, మహనీయులైన శ్రీవైష్ణవుల సమృద్ధితో నిండి ఉండే దివ్యక్షేత్రంలో భక్తుల కర్మలను తీర్చేవాడు- పద్మనాభస్వామి.

6. తన్పదియి నరుకు శేరుమ్ తణ్ణీరున్ద తోట్టత్తుళ్
వన్ప*ళ*త్తిన్ వాశనైయాల్ వా*ళ్*విక్కుమ్ మామ్మరఙ్గళ్ ।
అన్బినోడు పత్తరవరు మముతు శెయ్య ప*ళ*మ్ తన్దు
తన్పరత్తై నీక్కు మూరిల్ తఙ్గియశీర్ పఱ్పనాబనే ॥

తాను వేంచేసి ఉన్న సమీపంలో ఉండే, చల్లని నీటిని కల తోటలలో ఫలసమృద్ధియొక్క పరిమళంతో ఆనందాన్ని కల్గించే మామిడిచెట్లు, ప్రేమగా



పండ్లను భక్తులు ఆరగించేటట్లు ఇచ్చి, తమ భారాన్ని (పండ్ల బరువును) తీర్చుకొనే పద్మనాభక్షేత్రంలో వేంచేసి ఉండేవాడు - పద్మనాభస్వామి.

7. వేఙ్గడమ్ పల్మలైకళాలే విరిన్దరుమ్ శెయ్యుమ్ శేవై
శిఙ్గమలై యా*ళ*మాన శికరమరుమ్ శెయ్యుమ్ శేవై ।
తఙ్గితాన్ నిన్ఱ మలైయిన్ తక్కయుచ్చి తన్నురువాల్
పఙ్గమిన్ఱి కాట్టుమమ్మాన్ పఱ్పనాబ ననైవర్క్కే ॥

వేంచటాచలం పలు (సప్త) పర్వతాలతో భక్తి పూర్వకంగా చేసే సేవను, సింహాచలం గంభీరమైన శిఖరంతో చేసే సేవను, తాను వేంచేసి ఉండే పర్వతం పైన అందమైన శిఖరంపై తన రూపంతో ఏలోటు లేకుండా సేవను అందఱికి పద్మనాభస్వామి అనుగ్రహిస్తున్నాడు.

8. కామరుశీర్ అచ్చరైకళుమ్ కన్దర్వరుమ్ తామాడి పాడ
పూమి యిరున్ద మనిశరుమ్ పు*ఱ్ఱి*ల్ ప్పాముకళుమ్ కాణ ।
వేమరు నీళ్మలైయినుచ్చి వేట్కైయాల్ ఏఱి నిన్ఱాన్
పామరు శీరులకు మూన్ఱుమ్ పఱ్పనాబ నుయ్యప్పారుట్టే ॥

తమ అందంతో వ్యామోహాన్ని కల్గించే అప్సరసలు, గంధర్వులు, గానం చేసిపాడగా, దానిని భూమిలోని మానవులు, పుట్టలోని సర్పాలు చూడగా, వెదుళ్ళు నిండుగా ఉండే (వేడిమి నిండుగా ఉండే) ఉన్నతమైన పర్వవతం శిఖరాన్ని ప్రీతితో అధిరోహించి, విస్తృతమైన సంపదను కల ముల్లోకాలు ఉజ్జీవించాలని వేంచేసి ఉన్నాడు.

9. కడమ్బమరత్తుచ్చిమేలే కామన్తాతై యన్ఱేఱి
అడఙ్గ అనైవరాయ్చ్చికళై యవలోకిత్తిరుమ్బోల్ ।
పడఙ్గళ్పోల్ మలైయుచ్చి పయిలి యనైవరై తాన్ కాణ
ఇడఙ్గొణ్డు నిఱ్కుమమ్మాన్ ఈశన్దాన్ పఱ్పనాబనే ॥

కదంబ వృక్షాగ్రానికి ఆనాడు మన్మథుని తండ్రి అయిన కృష్ణుడు ఎక్కి, గోపకన్యలను అందఱిని చూచిన రీతిలో, పాము పడగల వలె ఉండే

పర్వతశిఖరంపై వేంచేసి అందఱిని తాను కటాక్షించడంకోసం అక్కడ నిలచి ఉండే స్వామి, ప్రభువు - పద్మనాభస్వామి.

**10. కడిశేర్ తణ్ణన్తుழாయాల్ కలన్దు నిన్ఱ తన్నడియై**
**నెడుమార్వత్తోడు వన్దు నెరుక్కి యుచ్చి త్తాక్క నిఱ్కుమ్ ।**
**అడియ నిరామానుశనై తన్నడిశేర్క్కుమ్ వకై యెణ్ణి**
**కడిన్దిరుళ్ ఞాల ముయ్క్కుమ్ కాదల్శీర్ పఱ్పనాబనే ॥**

పరిమళం నిండుగా కల్గిన, చల్లని, అందమైన తులసితో కూడి ఉండే తన శ్రీచరణాలను గొప్ప ఆర్తితో వచ్చి సమీపించి శిరస్సుతో స్పృశిస్తూ నిలచి ఉండే రామానుజస్వామి అనే పేరు గల దాసుడనైన నన్ను తన శ్రీచరణాలలో చేర్చుకొనే రీతిని తలచి, అజ్ఞానాన్ని తీర్చి లోకాన్ని ఉజ్జీవింపజేసే వాత్సల్యగుణాన్ని కల్గిన స్వామి- పద్మనాభుడు.

